## దశమహావిద్యల ఆవిర్భావం



శ్రీ ఆదిశక్తి అవతారాలు భూలోకంలో ఎన్నో ఉన్నట్లుగా వివిధ పురాణాలు పేర్కొంటు న్నాయి. ఇలా జగన్మాత ధరించిన అన్ని రూపాల్లో "దశ మహావిద్యలు" అనే పది రూపాలు ఎంతో విభిన్నమైనవిగా, విశిష్ట మైనవిగా లోకంలో ప్రసిద్ధి పొందాయి. పూర్వం దుర్గాదేవి లోకాలని కాపాడాలని దేవతల్ని ఉద్ధరించాలని దుర్గముడితో యుద్ధానికి ఉపక్రమించింది. దేవీ దుర్గముల మధ్య భయంకరంగా యుద్ధం కొనసాగుతున్న సమయంలో దేవీ శరీరం నుంచి ఒక్కసారిగా ఈ దశమహావిద్యలు ఆవిర్భవించాయని చెబుతారు.

## చింతామణి ద్వీప నివాసిని

శ్రీదేవి భాగవతంలోని 12వ స్కంధంలో ఆదిపరాశక్తి కొలువుండే మణిద్వీపంలోని నవరత్న ప్రాకారంలో ఈ దశమహావిద్యలన్నీ కొలువుదీరి ఉంటాయని చెప్పటం జరిగింది. దీనిని బట్టి చింతామణి ద్వీప నివాసిని అయిన ఆదిపరాశాక్తికి అత్యంత సమీపంలో నివసించే ఈ మహాశక్తులే దశమహావిద్యలని తెలుస్తుంది. అందుకే ఈ మహావిద్యలకి ఇంత గొప్ప ప్రాముఖ్యత లోకంలో కలిగింది.

# శ్రీ భువనేశ్వరీ దేవి



దశ మహావిద్యలలో **4వ మహావిద్య శ్రీ భువనేశ్వరీదేవి.** ఉదయించే సూర్యుడిలాంటి కాంతితో ప్రకాశించే ఈ దేవికి భాద్రపద శుక్లపక్ష అష్టమీ తిథి ప్రీతిపాత్రమైనది. ఈ దేవి సంపూర్ణ సౌమ్యస్వరూపిణి. ఈ దేవిని

ఉపాసించే సాధకుడికి మూడవ నేత్రం తెరుచుకుంటుంది. అంటే భూత భవిష్యత్ వర్తమానాలు తెలుసుకునే శక్తి లభిస్తుంది అంటారు. అంతేకాదు, రాజ్యధికారాన్ని సమస్త సిద్ధుల్ని సకల సుఖభోగాల్ని ఈదేవి అనుగ్రహంతో సాధకులు పొందవచ్చు. దశమహావిద్యాధి దేవతలలో ముఖ్యంగా చెప్పుకోదగినది భువనేశ్వరీదేవినే అంటారు. ఈమెనే మహావిద్య అని కూడా పిలుస్తారు.

## సమస్త భువనాలకు అధిదేవత



భువనేశ్వరి అంటే సమస్త భువనములకు అధిదేవత అని అర్థం. త్రిభువనములు అంటే భూః అంటే భూమి, భువః అంటే ఆకాశం, సువః స్వర్గము ఈ మూడింటిని ఏలే తల్లి అని అర్థం. ఈమెకే శ్రీ రాజరాజేశ్వరీ దేవి అనే పేరు కూడా ఉంది.

## అమ్మవారి జననం

ప్రాణతోషిణి గ్రంథంలో అమ్మవారి పుట్టుకకు సంబంధించి ఒక కథ చెప్పబడివుంది. ప్రళయంలో మునిగిన ఈ సృష్టిని తిరిగి మళ్ళీ పుట్టించడానికి బ్రహ్మ తిరిగి సృష్టి చేయనారంభించాడు. సృష్టిలో తాను కోరుకున్న ప్రతీ వస్తువునీ, ప్రతీ ప్రాణినీ బ్రహ్మ సృజించాడు. కానీ ప్రాణులలో క్రియా శక్తిని మాత్రం నింపలేకపోయాడు. అందుకోసం బ్రహ్మ ఆ జగన్మాత కోసం ఘోరతపస్సు చేసాడు. బ్రహ్మ తపస్సుకు మెచ్చిన జగన్మాత ఒక చేత పాశంతో, మరో చేత అంకుశంతో,

హస్తాలు ఉన్నాయి. ఈమె చేతులలో పాశము, అంకుశము మిగిలిన చేతులతో భయం తొలగిస్తూ స్వేచ్ఛను ప్రసాదిస్తూ అభయ ముద్రతో ఉంటుంది.

## శాకాంబరిగా అవతరణ



పూర్వం దుర్గమాసురుడు క్రూరుడై, అభేద్య వరాలు పొంది సమస్త సృష్టిలోని ప్రాణులను, దేవతలను బాధించసాగాడు. వాడి ప్రకోపం వలన భూమిపై జలధారలు ఎండిపోయి కరువు ఏర్పడింది. ఎంతో మంది తమ ప్రాణాలు విడిచారు. అప్పుడు ఋషులు, దేవతలు హిమాలయాలకు బయలుదేరి అమ్మవారికై ప్రార్థించారు. కారుణ్యమూర్తి అయిన మాత వెంటనే వారి ఎదుట ప్రత్యక్షమైంది. వారి కష్టాలను విన్న మాత తన సహస్ర అశ్రుధారలతో భూమిపై నదులను ప్రవహింపచేసి దుర్గమాసురుడి వలన ఏర్పడిన క్షామాన్ని తరిమికొట్టింది. వెంటనే భూమిపైన జీవకళ ఉట్టిపడింది. అమ్మ స్వయంగా తన చేతులతో శాకములను, కందాది మూలాలను సృష్టించింది. అందువల్లనే అమ్మ వారికి 'శాకంబరి' మరియు శతాక్షి అనే పేర్లు కూడా కలవు. అప్పుడు భువనేశ్వరి దేవి బాణములు, పాశము, అంకుశము మొదలైన ఆయుధాలు ధరించి దుర్గమాసురుడిని సంహరించింది.

## శాంతిని కోరుకునేవారికి భువనేశ్వరి

నిత్య జీవితములో పరిపూర్ణమైన శాంతిని కోరుకునే వారు శ్రీ భువనేశ్వరీ దేవిని ఉపాసించాలి. శ్రీ భువనేశ్వరీ దేవికి రాత్రి సిద్ధరాత్రి కాగా, త్రయంబకుడు శివుడుగా, పరమేశ్వరుడు భైరవుడుగా, త్రైలోక్య మోహిని యక్షిణిగా ఉంటారు.

## కాళికి, భువనేశ్వరికీ భేదము లేదు



బృహన్నీలతంత్రంలో అమ్మవారికి ఉన్న మూడు నేత్రాలు సృష్టి, స్థితి, లయలకు ప్రతీకలని వివరించబడింది. సృష్టిలో అవ్యక్తరూపంలో భువనేశ్వరి దేవి ఉంటే, వ్యక్తంగా కాళీ మాత ఉంటుంది. అందుకే ఇద్దరికీ భేదమే లేదు.

## అదితి రూపంలో భువనేశ్వరి

భువనం అంటే లోకం. ఈ లోకానికి సృష్టికర్త భువనేశ్వరి. ఈ సృష్టి మొత్తం భువనేశ్వరీ అవతారమే. ఈమెనే అదితి అని కూడా అంటారు. అ+దితి అంటే ఖండం కానిదని అర్థం. ఈ అదితి దేవతలందరికీ మాతృమూర్తి.

## పరమ శాంతి స్వరూపిణి

సమస్త భువనాలకు అధీశ్వరియైన ఈ దేవత ఉదయించే సూర్యుని వలె ప్రకాశిస్తుంటుంది. కిరీటం మీద చంద్రకళ, మూడు కన్నులు, చిరునవ్వు ఆమెకు అలంకారాలు. ఈమె పరమ శాంతి స్వరూపిణి

## పార్వతే భువనేశ్వరి



భువనేశ్వరి అనగా పార్వతీ దేవి. కాళి, తార, త్రిపుర సుందరీల ప్రకాశమునకు భువనేశ్వరి తెర వంటిది. దశమహావిద్యలు వామ, కౌళ సంప్రదాయములకు చెందినవి. వామ, కౌళములు సిద్ధపురుషులకే గాని సామాన్యులకు కాదు. పరమ దేవతా అనుగ్రహము పరిపూర్ణంగా పొందా లనుకుంటే సాంప్రదాయ పరంపరాగతంగా వస్తున్న ఆ దేవి యంత్ర, మంత్ర, తంత్ర, పూజా కల్పానాసారము విధి విధానం తెలుసుకొని అర్చించి దేవీ కృపకు పాత్రులు కావలసి ఉంటుంది.

## ఏడుకోట్ల మహామంత్రాలచే ఆరాధింపబడే దేవత

ఈ దేవిని ఏడుకోట్ల మహా మంత్రాలు ఆరాధిస్తుంటాయి. ఈ విశ్వాన్ని సృష్టించాలనే అభిలాషతో బ్రహ్మ క్రియా శక్తిని ఆహ్వానిస్తూ తీవ్రమైన తపస్సు చేశారు. ఆ తపస్సుకు మెచ్చిన పరమేశ్వరి భూదేవి రూపంలో ప్రత్యక్షమైంది. విశ్వానికే అధిదేవత కాబట్టే భువనేశ్వరీ అని పిలుస్తారు. అవ్యక్తం నుండి వ్యక్తమైన బ్రహ్మాండ రూపం, చైతన్య స్వరూపమే భువనేశ్వరీ దేవి.

# వేదగర్భం శ్రీభువనేశ్వరీస్తోత్రం

## అథవా శ్రీభువనేశ్వరీమహాస్తోత్రం




శ్రీగణేశాయ నమః ॥

**ధ్యానం**

ఓం చంచన్మౌక్తికహేమమండనయుతా మాతాఽతిరక్తాంబరా
తన్వంగీ నయనత్రయాతిరుచిరా బాలార్కవద్భాసురా ।
యా దివ్యాంకుశపాశభూషితకరా దేవీ సదా భీతిహా
చిత్తస్థా భువనేశ్వరీ భవతు నః సేయం ముదః సర్వదా ॥

కర్ణస్వర్ణవిలోలకుడలధరామాపీనవక్షోరుహాం
ముక్తాహారవిభూషణాం పరిలసద్ధమ్మిల్లసన్మల్లికాం ।
లీలాలోలితలోచనాం శశిముఖీమాబద్ధకాంచీస్రజం
దీవ్యంతీం భువనేశ్వరీమనుదినం వందామహే మాతరం ॥

# శ్రీభువనేశ్వరీ పంజర స్తోత్రం



ఇదం శ్రీ భువనేశ్వర్యాః పంజరం భువి దుర్లభం ।
యేన సంరక్షితో మర్త్యో వాణైః శస్త్రైర్న బాధ్యతే ॥ ॥ 1 ॥

జ్వరమారీపశువ్యాఘ్రకృత్యాచౌరాద్యుపద్రవైః ।
నద్యంబుధరణీవిద్యుత్కృశానుభుజగారిభిః ॥ ॥ 2 ॥

సౌభాగ్యారోగ్యసంపత్తికీర్తికాంతియశోఽర్థదం ॥ ॥ 3 ॥

ఓం క్రోం శ్రీంహ్రీంఐం సౌః పూర్వేఽధిష్ఠాయ
మాం పాహి చక్రిణి భువనేశ్వరి ।

# శ్రీ భువనేశ్వరీ మహావిద్యా కవచం-2



## ధ్యానం

ఉద్యద్దినద్యుతి మిందు కిరీటాం తుంగకుచాం నయనత్రయయుక్తాం

స్మేరముఖీం వరదాంకుశ పాశాం భీతికరాం ప్రభజే భువనేశీం॥ 1

బ్రహ్మరూపే సదానందే పరానంద స్వరూపిణి

ద్రుతసిద్ధి ప్రదే దేవి నారాయణి నమోస్తుతే ॥ 2

శౌరిశ్చకాస్తి హృదయేషు శరీర భాజాం తస్యాపి దేవి హృదయం త్వమను ప్రవిష్టా

పద్మే తవాపి హృదయే ప్రథతే ద మేయం త్వమేవ జాగ్ర దఖిలాతిశయం శ్రయామః ॥ 3

## కవచం

హ్రీం బీజం మే శిరః పాతు భువనేశీ లలాటకమ్

ఐం పాతు దక్ష నేత్ర మేం హ్రీం పాతు వామలోచనం ॥ 1

శ్రీం పాతుదక్షకర్ణం మే త్రివర్ణాత్మా మహేశ్వరీ

వామ కర్ణం సదా పాతు ఐం ఘ్రాణం పాతుమే సదా ॥ 2

# శ్రీభువనేశ్వరీ ప్రాతఃస్మరణం



ఉద్యదిన-ద్యు తిమిందు-కిరీటాం,

తుంగ-కుచాం నయన-త్రయ-యుక్తాం ।

స్మేరామభయ-వరాంకుశ-పాశాం,

ప్రాతః స్మరామి శ్రీభువనేశ్వరీం ॥ ॥ 1 ॥

# శ్రీభువనేశ్వరీ పంచకం అథవా ప్రాతఃస్మరణం



ప్రాతః స్మరామి భువనా-సువిశాలభాలం

మాణిక్య-మౌలి-లసితం సుసుధాంశు-ఖణ్డం ।

మందస్మితం సుమధురం కరుణాకటాక్షం

తాంబూలపూరితముఖం శ్రుతి-కుందలే చ ॥ ॥ 1 ॥

# శ్రీభువనేశ్వరీత్రిశతీనామావళి



అస్య శ్రీభువనేశ్వరీ త్రిశతీమాలామహామంత్రస్య సదాశివఋషిః,

అనుష్టుప్ఛందః, భువనేశ్వరీ దేవతా,

లజ్జా బీజం, కమలా శక్తిః వాగ్భవం కీలకం

సర్వాభీష్టసిద్ధ్యర్థే జపే వినియోగః ॥



# శ్రీ భువనేశ్వరి అష్టోత్తర శత నామావళి



ఓం ఐం శ్రీం హ్రీం క్లీం మహామాయాయై నమః

ఓం ఐం శ్రీం హ్రీం క్లీం మహావిద్యాయై నమః

ఓం ఐం శ్రీం హ్రీం క్లీం మహాయోగాయై నమః

ఓం ఐం శ్రీం హ్రీం క్లీం మహోత్కటాయై నమః

ఓం ఐం శ్రీం హ్రీం క్లీం మహేశ్వర్యై నమః



# శ్రీభువనేశ్వరీసహస్రనామస్తోత్రం



**శ్రీదేవ్యువాచ - శ్రీపార్వత్యువాచ -**

దేవ దేవ మహాదేవ సర్వశాస్త్రవిశారద ! ।
కపాలఖట్వాంగధర ! చితాభస్మానులేపన ! ॥ 1 ॥

యా ఆద్యా ప్రకృతిర్నిత్యా సర్వశాస్త్రేషు గోపితా ।
తస్యాః శ్రీభువనేశ్వర్యా నామ్నాం పుణ్యం సహస్రకం ॥ 2 ॥

కథయస్వ మహాదేవ ! యథా దేవీ ప్రసీదతి ।